**01వశ్లోకం**

శి, వ అను రెండు అక్షరాలు ఎంత గొప్పవో ఈ మొదటి శ్లోకంలో కవి చెబుతున్నారు.

శిఖరిణీ

శివేతి ద్వావర్ణౌ పరపద నయద్ధంస గరుతౌ

తటౌ సంసారాబ్దే ర్నిజ విషయ బోధాఙ్కుర దలే ।

శ్రుతే రంతర్గోపాయిత పర రహస్యౌ హృదిచరౌ

ఘరట్టగ్రావాణౌ భవ విటపి బీజౌఘ దలనే ॥

ప్రతిపదార్థం

శివ+ఇతి - శి, వ అను)

ద్వావర్ణౌ - రెండు అక్షరాలు)

పరపద నయత్ + హంస గరుతౌ- మోక్షము అను ఉన్నతమైన ఆకాశమువైపు మనలను తీసుకుపోవు రెండు హంసల రెక్కల వంటివి శివ అను రెండు అక్షరాలు )

తటౌ సంసార+అబ్ధేః ,- సంసార+అబ్ధేః , తటౌ-సంసారమను సముద్రమునకు రెండు ఒడ్డుల్లాంటివి శివ అను రెండు అక్షరాలు)

నిజ విషయ బోధ +అంకుర దలే -తనయొక్క అనగా ఆత్మ జ్ఞానము అను అంకురము నుంచి వచ్చిన రెండు దళాలు శివ అను రెండు అక్షరాలు )

శ్రుతేః అంతః +గోపాయిత పరరహస్యౌ- వేదంలో దాచబడ్డ రహస్యంగా చెప్పబడిన కర్మ, జ్ఞాన మార్గములనే రెండు శ్రేష్ఠమయిన రహస్యములు కలిగినవి శివ అను రెండు అక్షరాలు.)

హృదిచరౌ - హృదయమునందు చరించునవి శివ అను రెండు అక్షరాలు)

ఘరట్టగ్రావాణౌ భవ విటపి బీజౌఘ దలనే -(రెండు తిరుగలి రాళ్ళలా , జన్మలనే చెట్లను పుట్టించగల కర్మలనే విత్తనాల సమూహమును చీల్చునవి, పిండిచేయునవి, )

**02వశ్లోకం**

శి, వ అను రెండు అక్షరాలు ఎంత గొప్పవో ఈ రెండవ శ్లోకంలో కవి చెబుతున్నారు.

శిఖరిణీశ్లోకం:

శివేతి ద్వావర్ణౌ జనన విజయ స్తంభ కలశౌ

దురంతాంతర్ధ్వాంత ప్రమథన శుభాధాన చతురౌ _

మహాయాత్రాధ్వస్య ప్రముఖ జనతా కంచుకివరౌ

మరుత్ఘుంపాయౌ తౌ కృతఫల నవాంభోదమథనే __

ప్రతి పదానికి అర్థం:

శివ+ఇతి → "శివ" అనే

ద్వావర్ణౌ → రెండు అక్షరాలు (ద్వి + వర్ణ = రెండు అక్షరాలు)

జనన → జనన,మరణాలపై (జీవనచక్రంపై)

విజయ → సాధించిన విజయాన్ని సూచించే

స్తంభ → స్తంభముల మీద పెట్టిన

కలశౌ → కలశాల వలె పవిత్రమైనవి. (రాజులు విజయం సాధించినప్పుడు విజయ స్తంభాలు పాతి, వాటిపై కలశాలు లేదా జెండాలు పెడతారు .అలాగే జనన మరణాలపై విజయం సాధించటానికి గుర్తుగా ఆ విజయ స్తంభాల మీద పెట్టిన కలశాల వంటివి శి,వఅనే రెండు అక్షరాలు

దురంత → అత్యంత భయంకరమైన

అంతః+ధ్వాంత → అంతర్గతమైన అంధకారాన్ని

ప్రమథన → ఛేదించి నశింపజేసి

శుభ+ఆధాన → వెలుగులశుభాన్ని ప్రసాదించే

చతురౌ → చతురమైన సూర్యచంద్రుల వంటివి శి,వ అనే రెండు అక్షరాలు

మహాయాత్రా → సంసార మహాయాత్ర అను (పునర్జన్మ చక్రం లేదా మోక్ష ప్రయాణంలో)

అధ్వని → మార్గములో

ప్రముఖ → ముఖ్యమైన

జనతా → జన సంఘటనల మధ్య

కంచుకివరౌ → రక్షణగా నిలిచే ఇద్దరు అంగరక్షకుల వంటివి శివ అనే రెండు అక్షరాలు

తౌ → ఆ రెండు (- "శి" & "వ") కృతఫల → ప్రారబ్ధ కర్మఫలాన్ని ఇచ్చే

నవాంభోద మథనే → కొత్తదైన మేఘములను మథించి నశింపజేసి

మరుత్ +ఝంపాయౌ → చెల్లాచెదరు చేసే ప్రచండ వాయువుల వంటివి (ప్రారబ్ధ కర్మ ఫలాన్ని కురవటానికి సిద్ధంగా ఉన్న ప్రళయకాల మేఘాలను చెల్లాచెదరుచేసి రక్షించే ప్రచండ వాయువులు శివ అనే రెండక్షరాలు .ప్రారబ్ధమనగా ప్ర+ అరబ్ధము. ఎప్పటినుంచో మనం చేసుకున్న కర్మ ధనస్సు నుంచి విడిచిపెట్టిన బాణంలా ప్రయాణాన్ని ప్రారంభించింది. అది జీవ లక్ష్యాన్ని తాకక తప్పదు. కాని ఆ ప్రారబ్ధ బాణాన్ని కూడా ఆపగలిగే శక్తి శివ అనే రెండక్షరాలకు ఉన్నదని శంకర భగవత్పాదుల వారి వర్ణన)

**సారాంశం:**

"శి" మరియు "వ" అనే రెండు అక్షరాలు జనన మరణ చక్రాన్ని నిలిపివేస్తాయి. ఇవి మానవ జీవితంలో అంధకారాన్ని తొలగించి మోక్షాన్ని ప్రసాదించే శక్తిని కలిగి ఉంటాయి. ఈ అక్షరాలు మోక్ష మార్గంలో శరణార్థులకు రక్షణ కవచంలా నిలుస్తాయి. మన జీవిత యాత్రలో జీవిత యాత్రలో ఎదురయ్యే ప్రారబ్ధ కష్టాలను పరిష్కరించి, జీవన విజయాన్ని అందిస్తాయి.

... **03శ్లోకం:**

శివేతి ద్వౌవర్ణౌ శివమవదతాం చైవ వసుధా--
ముభాభ్యాం వర్ణాభ్యాం రథరథిక యో రాజ్యకలనాత్ _
తతః సర్వః శేషః పరికర ఇహాన్యత్కిమపి నో
క్వ చాహం క్వ త్వం వా క్వ పరమిదమూహ్యం బుధగణైః __ 3 __

**ప్రతిపదార్థం:**

**శివ+ఇతి→ 'శివ' అని**

**ద్వౌ వర్ణౌ → రెండు అక్షరాలు**

**శివం → శివుని**

**అవదతాం → చెప్పేవారికి**

**చ → మరియు**

**ఏవ → ఇట్లే**

**వసుధామ్ → భూమి**

**ఉభాభ్యాం → ఆ రెండింటి (శి-వ అక్షరాల ద్వారా)**

**వర్ణాభ్యాం → అక్షరాల ద్వారా(శి-వ అక్షరాల ద్వారా)**

**రథరథిక → రథము మరియు రథికుడు (శివుడు)**

**యః → ఏ శివుడు**

**రాజ్యకలనాత్ → పరిపాలన వ్యూహం ద్వారా**

**తతః → అటుపిమ్మట**

**సర్వః → అంతా**

**శేషః → మిగిలిన**

**పరికరః → ఉపకరణాలు**

**ఇహ → ఈ లోకంలో**

**అన్యత్ +కిమపి → మరేదైనా**

**న→ లేవు**

**క్వ → ఎక్కడ**

**చ → మరియు**

**అహం → నేను**

**క్వ త్వం వా → నీవెక్కడ?**

**పరం → పరతత్త్వం (శివమయమయిన సత్యం)**

**క్వ → ఎక్కడ**

**ఇదమ్ → ఇది**

**బుధగణైః → పండితులచే ఊహ్యం → ఊహించదగినది**

**తాత్పర్యం (సారాంశం):**

**ఈ శ్లోకం త్రిపురాసుర సంహార సందర్భాన్ని వివరిస్తుంది. శివుడు రథికుడు, భూమి (వసుధా) ఆయన రథము. ఈ రెండు (రథికుడు, రథం) శివ అనే రెండు అక్షరాల ద్వారా సూచించబడుతున్నాయి. అంటే, 'శి' అక్షరం శివునికి, 'వ' అక్షరం భూమికి సంకేతం. ఈ రెండు అక్షరాలే శివతత్త్వాన్ని తెలియజేస్తున్నాయి.**

**మిగతా పరికరాలన్నీ (సమూహాలు) ఈ రెండు అక్షరాల్లోనే అంతర్భూతమైపోతాయి.**

అంతా శివమయం అయిన ఈ జగత్తులో "నీవెక్కడ? నేనెక్కడ? పరతత్త్వం ఎక్కడ?" దీనిని వివేకులు మాత్రమే ఊహించగలరు. సర్వము శివమయమని భావన.

**04 శ్లోకం:**

ఈ శ్లోకం "శివ" అనే పదం ద్వ్యక్షర సముదాయముగా ఉన్నప్పటికీ, దానికి రెండు విశిష్టమైన అర్థాలున్నాయని వివరిస్తుంది.

**శివేతి ద్వావర్ణౌ విహపరసుఖాధాన చతురౌ**
**క్రమోచ్చారాద్ధాతోర్వినిమయవశాదర్థఘటనే-**
**రహస్యార్థో హ్యేషః ప్రకటయతి నామ్ని క్షితిరథం**
**ప్రజానామానందం కిమితి న విదుర్మూఢధిషణాః __ ४ __**

శివేతి = శివ + ఇతి → "శివ" అని

ద్వావర్ణౌ = ద్వౌ + వర్ణౌ → రెండు అక్షరాలు (శి + వ)

ఇహపరసుఖాధాన = ఇహ + పర + సుఖ + ఆధాన → ఇహలోక సుఖాన్ని పరలోక సుఖాన్ని పండించి ఇచ్చు (విహగము), పరమమైన, ఆనందం, స్థాపకుడు (శివుడు)

చతురౌ = చాతుర్యము కలవి.

క్రమోచ్చారాత్ = కర్మ + ఉచ్చారాత్ → వాటిని క్రమంగా ఉచ్చరించినప్పుడు

ధాతోః = → మూలధాతువు యొక్క (ధాతుపదం)

వినిమయవశాత్ = అక్షరాల క్రమము యొక్క మార్పు వల్ల("శి-వ" బదులు "వ-శి")

అర్థ + ఘటనే - అర్థ సమన్వయానికి తగిన విధంగా మారి

క్షితిరథం = భూమిని రథముగా చేసుకొని ప్రయాణించిన శివుని

నామ్ని = నామంలో ఉన్న

రహస్యార్థః = రహస్య + అర్థః → గూఢార్థమును

ప్రజానాం = ప్రజలకు

ఆనందం = సంతోషమును వశీకరించి ఇచ్చుచున్నవి.( శివ అను అప్దము "వశి" అనే పదమై ప్రజల ఆనందాన్ని వశపరిచే అర్థాన్ని ఏర్పరచుతుందని భావం).

హి = నిజముగా

ఏషః = ఈ శ్లోకంలో చెప్పిన విషయం

ప్రకటయతి =లోకములో వెల్లడించుచున్నది

కిమితి = కిమ్ + ఇతి → ఏమి అని అహంకరిస్తూ

మూఢధిషణాః = అజ్ఞానపు బుద్ధి గలవారు

న విదుః = ఈ మార్పును తెలుసుకోలేరు

**తాత్పర్యం:**

"శివ" అను రెండు అక్షారలు నిష్క లంకంగా ఉచ్చరిస్తే, పరమశివుడిని సూచిస్తూ ఇహ, పరలోక సుఖాలను అనుగ్రహించే మహత్తరమైన నామంగా ఉంటుంది.

అక్షర క్రమం తప్పితే ("శి-వ" బదులు "వ-శి"), "వశి" అనే పదమై అది కూడా ఆనందాన్ని వశపరిచే అర్థాన్ని ఏర్పరచుతుంది.

ఈ తత్వాన్ని అవగతం చేసుకోలేని మూర్ఖులు దీనిని సరిగ్గా అర్థం చేసుకోలేరు.

ఈ విధంగా, శివనామ మహిమను గూడార్థంగా, వ్యాకరణ సంబంధిత విశేషాలతో వివరిస్తున్న గొప్ప శ్లోకం ఇది.

05 శ్లోకం:.

శివేతి ద్వావర్ణౌ యజుషితు చతుర్థ్యేకవచనో
నమః పూర్వో మంత్రః సమజనిజనిధ్వంస హతయే-
తథాపి ప్రజ్ఞాంధాః జననమృతి నక్రాహిజటిలే
పతంత్యేతచ్చిత్రం భవజలధిపంకే శివశివ __ 5

శివ +ఇతి – "శివ" అనే

ద్వౌ వర్ణౌ – రెండు అక్షరాల జంటను

చతుర్థి+ఏకవచనః – చతుర్థీవిభక్తి, ఏకవచన రూపముగా చేసి

నమః పూర్వో మంత్రః – ముందు "నమః" అనే పదం కలిగి ఉన్న మంత్రం గా మారి

జని నిధ్వంస హతయే – జననమరణములను నశింపజేయుటకు

యజుషితు – యజుర్వేదమునందు

సమజని – ఉద్భవించింది, జన్మించింది

తథా +అపి – అయినా

ప్రజ్ఞ+అంధాః – జ్ఞానహీనులు, అజ్ఞానులు

జనన మృతి నక్రాహి జటిలే – జననమరణమనే మొసళ్లు, పాములు కలిగి ఉన్న

భవజలధి పంకే – సంసార సముద్రంలోని బురదలో

పతంతి – పడిపోతున్నారు

ఏతత్ +చిత్రం – ఇది ఎంత ఆశ్చర్యం!

శివ శివ – ఓ శివా! ఓ శివా!

తాత్పర్యం

యజుర్వేదంలో "నమః శివాయ" అనే మంత్రం రూపొందిన విధానం గురించి ఈ శ్లోకం వివరిస్తుంది.

"శివ" అనే రెండు అక్షరాలను చతుర్థీవిభక్తిలో ఉంచి, ముందు "నమః" అనే పదాన్ని కలిపితే, అది "నమః శివాయ" అనే మంత్రంగా మారుతుంది. ఈ మంత్రం జనన-మరణ చక్రాన్ని నశింపజేసే శక్తి కలిగి ఉంది.

అయితే, ఈ మంత్రశక్తి ఉండగానే కూడా అజ్ఞానులు జననమరణమనే మృగాలు (పాములు, మొసళ్లు) నిండిన ఈ భవసాగర బురదలో పడిపోతున్నారు. ఇది ఎంత విచిత్రం! ఓ శివా! ఓ శివా!

ఈ శ్లోకంలో ప్రధానంగా "నమః శివాయ" మంత్ర మహిమను చెప్పడం జరిగింది.

- ఈ మంత్రం యజుర్వేద మూలంతో సనాతనంగా వస్తున్నది.
- ఈ మంత్రాన్ని జపిస్తే జననమరణ చక్రం నుంచి విముక్తి పొందవచ్చు.
- అయినా కూడా అజ్ఞానులు ఈ వేదాంతాన్ని గ్రహించలేక, కష్టసంకటాలతో నిండిన సంసారంలో మునిగిపోతున్నారు.
- ఈ వేదాంతాన్ని అర్థం చేసుకుని, "శివ" నామస్మరణ చేయడం ద్వారా మోక్షాన్ని సాధించవచ్చు.

**సారాంశం:**

**"శివ" అనే నామస్మరణ మోక్షాన్ని ప్రసాదించే మహామంత్రం. కానీ, అజ్ఞానులైన మనుషులు సంసార బంధనంలో చిక్కుకుని ఉంటున్నారు. శివభక్తి ద్వారా జననమరణములను దాటిపోవచ్చు.**

**06వ శ్లోకం**

**శివేతి ద్వావర్ణౌ భజత భజదానందజనకే**

**భువో భర్తా భూత్వా స తు భవతి ముక్తేరపి తథా-**

**ఉభాభ్యాం వర్ణాభ్యామధిగమయతార్తం వినిమయాత్**

**వవర్ణో భూభారం దిశతి హి శికారః పరపదమ్ __ ౬ __**

**ప్రతిపదార్థం:**

**శివ+ఇ తి - 'శివ' అనే**

**ద్వౌ వర్ణౌ - రెండు అక్షరములను**

**భజత – సేవించండి.**

**భజద +ఆనందజనకే - (ఈ రెండు అక్షరములు) సేవించువారికి ఆనందాన్ని కలిగించును**

**స తు - ఈ రెండు అక్షరములు సేవించువాడు**

**భువః భర్తా భూత్వా - భూమికి అధిపతి**

**భవతి - అవుతాడు**

**తథా - అలాగే**

**ముక్తేః అపి - ముక్తికి కూడా అధిపతి అవుతాడు .**

**ఉభాభ్యాం వర్ణాభ్యాం - ఈ రెండు అక్షరములు**

**ఆర్తం* అధిగమయత * - కష్టంలో ఉన్నవారిని పైకి తీసుకువచ్చును**

**వినిమయాత్ - అక్షర మార్పున వల్ల**

**వవర్ణః - 'వ' అక్షరము**

**భూభారం - భూమి భారం (భూమి) అనగా రాజ్యాధికారాన్ని**

**దిశతి - ప్రసాదించును**

**హి - నిజముగా**

**శికారః - 'శి' అక్షరము**

**పరపదమ్ - పరమ పదము (ముక్తి)**

---

**తాత్పర్య విశేషాలు :**

**ఈ శ్లోకంలో ఆదిశంకరులు 'శివ' అనే రెండు అక్షరాల గొప్పతనాన్ని వివరించారు.**

**'శివ' అనే రెండు అక్షరాలను ఎవరైనా భక్తితో జపిస్తే వారికి ఆనందం కలుగుతుంది. ఈ నామస్మరణ వల్ల వారు భూమిపై అధికారం పొందగలరు, అలాగే మోక్షాన్ని కూడా అందుకోగలరు.**

ఈ రెండు అక్షరాలను మారిస్తే 'వశి' అనే పదం ఏర్పడుతుంది. ఇందులో 'వ' అక్షరం భూమిని సూచిస్తుంది, అంటే భూమిపై అధిపత్యం వస్తుంది. 'శి' అక్షరం శివుని సూచిస్తుంది, అంటే ముక్తిని ప్రసాదిస్తుంది. కనుక శివనామస్మరణ వల్ల భౌతిక మరియు ఆధ్యాత్మిక ఫలితాలు రెండూ లభిస్తాయి.

ఈ శ్లోకం ద్వారా శంకరులు మనకు శివనామ మహిమను స్పష్టంగా తెలియజేశారు.

శివనామాన్ని జపించడం ద్వారా భూలోకంలో కీర్తిని, పరలోకంలో ముక్తిని పొందవచ్చు.

**07వ శ్లోకం**

శివేతి ద్వౌవర్ణౌ ద్వివచన కృత ద్వంద్వకలనా
ద్బువంతౌ గూఢార్థం భగవదనుబంధాన్విత ధియః
న కశ్చి న్మంత్రశ్చ ప్రథయతి తదర్థాను గమనం
తతోయం సర్వాసు శ్రుతిషు జయఘంటా విజయతే|| 07

ప్రతి పదార్థం:

భగవ త్+అనుబంధ+అన్విత ధియః → భగవంతుని సంబంధంతో ఉన్న జ్ఞానము కలవారికి

శివ +ఇతి → "శివ" అనే

ద్వౌవర్ణౌ → రెండు అక్షరాలు (శి + వ)

ద్వివచన కృత → ద్వివచనంగా చేయబడిన (అంటే ఇద్దరిని సూచించేది)

ద్వంద్వకలనాత్ → ద్వంద్వ సమాసమును చెప్పుకొనునప్పుడు (రెండు వస్తువులను కలిపిన పదం)

గూఢార్థం → రహస్యమైన అర్థమును

బ్రువంతౌ → బోధించుచున్నది

చ - మరియు

త త్ +అ ర్థ +అ ను గమనం → ఈ అర్థాన్ని అనుసరించగలిగిన

కశ్చిత్ +మంత్రః న ప్రథయతి → → ఇంకో మంత్రం ప్రఖ్యాతిలో లేదు.

తతః → అందువలన

అయం - ఈ శివ నామము

సర్వాసు శ్రుతిషు → సకల వేదములందు

జయఘంటా → విజయ ఘంట వలె (విజయ దుందుభివలె)

విజయతే → ప్రసిద్ధమై విరాజిల్లుతోంది

తాత్పర్యం

"శివ" అనే పదం రెండు అక్షరాలతో ఉంటుంది. ఇది ద్వివచనంలో ఉంది (అంటే ఇద్దరిని సూచిస్తుంది).

వాస్తవానికి, ఇది ( శివ అను ద్వంద్వ సమాసం) "శివ" అనగానే పార్వతీదేవి, పరమేశ్వరుడు ఇద్దరూ అర్థం అవుతారను ఒక గొప్ప రహస్యాన్ని చెబుతున్నది. –

ఇలా అర్థాన్ని చెప్పగల మంత్రం ఇంకేదీ లేదు.

అందుకే శివ నామము వేదములన్నిటిలోనూ గొప్పగా ప్రతిధ్వనిస్తున్న విజయ ఘంట (జయఘంట) వంటిదని చెప్పవచ్చు (శివ నామమును మించిన మంత్రము లేదు. అది వేదసారమైనదని భావం)

**08వ శ్లోకం**

**శివేతి ద్వావర్ణౌ ప్రథమమభిధాయానుగుణతః**

**అథో మే సంధానాద్గతిరితి చ సంధాన పఠథ-**

**న కాలో బధ్నాతి త్యజతి నను తత్కాల ఇహ వః**

**కిమర్థం సంసారే పతథ యతథేమం మనువరమ్ __ ౮ __**

**శ్లోకంలోని ప్రతి పదాన్ని విడదీసి వివరణ:**

**శివేతి — "శివ" + "ఇతి" - శివ అను**

**ద్వావర్ణౌ — "ద్వౌ" + "వర్ణౌ"**

**- రెండు అక్షరాలు కలిగిన శబ్దాన్ని**

**ప్రథమం — మొదటగా, ముందుగా**

**అభిధాయ — ఉచ్ఛరించిన వెంటనే**

**అనుగుణతః — అనుగుణంగా, తగిన విధంగా**

**అథః — తరువాత, తదుపరి**

**మే = మే అను అక్షరాన్ని**

**8సంధానాత్ — అనుసంధానించి**

**గతిః ఇతి = తరువాత గతిః ఇతి — అనేలా**

**చ — మరియు**

**సంధాన- జతచేసి**

**పఠథ = చదవండి (ఆజ్ఞార్థక రూపం)**

**తత్కాల — అలా చదివిన సమయంలో, వెంటనే**

**కాలః — కాలుడు (యమధర్మరాజు)**

**న బధ్నాతి — బంధించడు, కట్టివేయడు**

**త్యజతి నను — విడిచిపెడతాడు కదా!**

**ఇహ — ఇక్కడ (ప్రపంచంలో)**

**వః — మీరు**

**కిమర్థం — ఎందుకు?**

**సంసారే — సంసారంలో (జనన మరణ చక్రంలో)**

**పతథ — పడిపోతారు, ?**

**ఏమం — ఈ (మంత్రమును)**

**. మనువరమ్ — శ్రేష్ఠమైన మంత్రాన్ని ( శివో మేగతిః )**

**యతథ — జపించటానికి ప్రయత్నించండి, కృషి చేయండి**

**తాత్పర్య విశేషాలు:**

**- శివనామ జపము మోక్షానికి దారి తీస్తుంది.**

- "శివ" అనే రెండు అక్షరాలతో "మే గతిః అని కలిపి "శివో మే గతిః" అని సంధి చేయగానే, ఆ భక్తుడు మోక్షం పొందుతాడు.

- శివనామాన్ని జపించువాడు కాలబంధనానికి లోను కాడు.

- యముడు అతన్ని పట్టుకోలేడు.

ఈ విషయం తెలియక మానవులు సంసారంలో ఎందుకు పడిపోతారు?

మోక్షానికి శివనామ జపమే సరైన మార్గమని శంకరుల బోధ.

09వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ చరమపద విశ్వస్వర యుతా

వహం శబ్దోచ్చారా ద్భవతి ఖలు వర్ణత్రయమనుః

ఇమం ప్రాణాయామైః పఠథ హఠయోగాదిభిరలం

భవే దాత్మేశైక్యం కరబదర తుల్యం బుధవరాః__ 9

ప్రతి పదార్థం:

బుధవరాః — ఓ గొప్ప జ్ఞానులారా!

శివ +ఇతి — "శివ" అని

ద్వౌ వర్ణౌ — రెండు అక్షరముల జంటకు (శి + వ)

చరమపద -చివరగా ఉన్న

విశ్వస్వర యుతౌ — విశ్వస్వరము (ఓంకారము) తో కూడిన

*అహం శబ్ద+ఉచ్చారాత్ — "అహం" అనే శబ్దాన్ని కలిపినట్లయితే

వర్ణత్రయమనుః — మూడు అక్షరాల మంత్రము (శివ+ఓం+అహం = శివోహం)

భవతి ఖలు — అవుతుంది కదా !

ఇమం — ఈ మంత్రమును

ప్రాణాయామైః- ప్రాణాయామము చేసుకుంటూ

పఠథ — జపించండి

హఠయోగాదిభిః +అలం — హఠయోగాది పద్ధతులను అనుసరించకుండానే

కరబదర తుల్యం — చేతిలో రేగు పండు ఉన్నంత సులభముగా

ఆ త్మ +ఈ శ +ఐ క్యం — మీ ఆత్మ ఈశ్వరునితో ఒక్కటిగా

భవే త్ = మిళితమగును

తాత్పర్యం

"శివ" అనే రెండు అక్షరాల తరువాత "ఓం" కారము చేర్చి, దానికి "అహం" అనే పదమును కూడా కలిపితే "శివోహం" అనే మూడక్షరాల మంత్రం ఉత్పన్నమవుతుంది.

ఓ మహాజ్ఞానులారా! ఈ మంత్రమును మీరు ప్రాణాయామంతో జపించండి. దీనికోసం హఠయోగము మొదలయిన కఠిన సాధనలను చేయనవసరం లేదు.

కేవలం "శివోహం" అనే మంత్రాన్ని ప్రాణాయామంతో జపిస్తే, మీ ఆత్మ ఈశ్వరునితో ఒక్కటిగా కలిసిపోతుంది. ఇది చేతిలో రేగు పండు పట్టుకున్నంత తేలికైనది!

**విశేషాలు**

హఠయోగమనగా శ్వాసను నిలిపి ఉంచుతూ చేసే అమూర్త ధ్యానం. ఇది సాధారణంగా ఒక కాలు మీద నిలబడటం, చేతులు పైకి ఎత్తడం, తల తలక్రిందులుగా ఉంచి పొగ పీల్చడం వంటి కఠినమైన భక్తి పద్ధతి. ఇది రాజయోగానికి (సులభమగు ధ్యానపద్ధతి) వ్యతిరేకం. కఠినమైన తపస్సు.

ప్రాణాయామమనగా నాసికాముఖములయందు సంచరించెడు వాయువును మంత్ర పూర్వకముగా నిరోధించుట.

ఒక క్రమ పద్ధతిలో గాలిని పీల్చడం, వదలడం ప్రాణాయామంలో ముఖ్యం.

కొన్ని పద్ధతులు ఇవీ :

1. పాప క్షయం కోసం గాలిని లోపలకు పీల్చి వ్యాహృతి, ప్రణవ శిరో యుక్తంగా మూడు సార్లు గాయత్రి మంత్రాన్ని జపించడం. (వ్యాహృతులు అంటే భూః, భువః, సువః అనే శబ్దాలు. ప్రణవ శిరో యుక్తంగా అంటే ఓంకారంతో ప్రారంభించడం.)

2. చిటికెన వ్రేలు, ఉంగరపు వ్రేలు కలిపి నాసిక ఒక వైపు మూయడానికీ, బొటన వ్రేలు నాసిక రెండవ వైపు మూసివేయడానికి ఉపయోగిస్తూ, ఒక సారి నాసిక ఎడమవైపు నుంచీ, తరువాత కుడివైపు నుంచీ గాలి పీలుస్తూ రెండవ వైపునుంచి గాలి వదలే మరొక పద్ధతి ఉంది. ఇలా మార్చి మార్చి గాలి పీల్చే పద్ధతిలో మాత్రల కాల పరిమితిని ఉపయోగించవచ్చు.

3. 1-4-2 నిష్పత్తిలో గాలిని లోపలికి పీల్చి, కుంభించి, వదలడం. పదహారు మాత్రల కాలం పీల్చడం, అరవై నాలుగు మాత్రల కాలం గాలిని లోపల బంధించడం, ముప్పది రెండు మాత్రల కాలం వదలడం ఒక పద్ధతి.

4. కొందరు ప్రణవాన్నీ, మరికొందరు ఇతర బీజాక్షరాలనూ, మంత్రాలనూ జపిస్తూ గాలిని పీల్చి వదలడం చేస్తుంటారు. గాలిని పీల్చడం, వదలడం వరకు ఎవరు ఎంత సేపు చేయగలిగితే అంతే చేయవచ్చు. కుంభించే విషయంలో గురువు పర్యవేక్షణ చాలా అవసరం. మేలు జరగకపోగా కీడు జరిగే ప్రమాదం ఉంది. ప్రాణాయామం గురు ముఖంగా నేర్చుకోవడం సదా శ్రేయస్కరం.

**10 వ శ్లోకం**

**శివేతి ద్వౌ వర్ణౌ మమ కనక రత్నాయుషకథా**
**సుధా భోగా భోగా మనుజప తపోధ్యాన విధయః**
**ప్రథా మేధా బోధస్స్మృతి రతిగతి ప్రాప్తివిధయః**
**భవేతాం ప్రారబ్ధ ప్రమథన శుభాధాన చతురౌ||**

'శివ' యను రెండక్షరములు ఎన్నడో వెనుకచేసిన పుణ్యపాపములను నశింపజేసే శుభమును కలిగించుటయందు నేర్పుకలవి. అవి నాకు బంగారమును, రత్నములను ఆయువును, దివ్యభోగములను, జపమును, ధ్యానమును ప్రసాదించి ప్రథను, మేధను, జ్ఞానమును, స్మృతిశక్తిని, నిత్యానందమును అనుగ్రహించుగాక!

(శివనామమువలన బడయ జాలనిది లేదు.)

**ప్రతిపదార్థం:**

- శివ+ఇ తి ద్వౌ వర్ణౌ → "శి" & "వ" అనే రెండు అక్షరాలు
- మమ కనక రత్న ఆయుష కథా → నాకు బంగారం, రత్నాలు, ఆయువు ప్రసాదించేవి
- సుధా భోగా భోగా మనుజప తపోధ్యాన విధయః → దివ్య భోగాలు, తపస్సు, ధ్యానం కలిగించేవి
- ప్రథా మేధా బోధస్స్మృతిః +అతిగతి ప్రాప్తి విధయః → ప్రఖ్యాతి, మేధస్సు, జ్ఞానం, స్మృతి, ఆనందం, మోక్షాన్ని ఇచ్చేవి

- ప్రారబ్ధ ప్రమథన శుభ+ఆధాన చతురౌ భవేతాం → పూర్వజన్మ కర్మలను నిర్మూలించే శుభాన్ని ప్రసాదించే అక్షరాలుగా అనుగ్రహించుగాక !

---

తాత్పర్యం:

"శివ" అనే రెండు అక్షరాలు అపారమైన శక్తిని కలిగిస్తాయి. ఈ నామస్మరణ వల్ల:

- బంగారం, రత్నాల వంటి విలువైన వస్తువులు లభిస్తాయి.
- ఆయుష్షు పెరుగుతుంది.
- మానవులకు తపస్సు, ధ్యానం, భోగసుఖాలు సిద్ధిస్తాయి.
- మంచి పేరు, మేధస్సు, జ్ఞానం, మతిస్థిమితం, ఆనందం, మోక్షం లభిస్తాయి.
- పూర్వ జన్మ పాపఫలాలను తుడిచివేసి శుభాన్ని ప్రసాదిస్తాయి.

---

విశేషాలు:

- శివనామ మహిమ:

శివనామస్మరణ వల్ల అనేక శుభఫలాలు కలుగుతాయి.

- 1. భక్తుల కలయిక: భక్తుల ప్రార్థనలకు శివుడు తక్షణమే అనుగ్రహిస్తాడు.
- 2. పాపవిమోచనం: మనిషి గతజన్మ కర్మఫలాల నుంచి విముక్తి పొందడానికి శివనామమే మార్గం.
- 3. శివతత్త్వం: శివుని ఆరాధనతో భౌతిక, ఆధ్యాత్మిక సంపదలు సిద్ధిస్తాయి.

ఈ శ్లోకం ద్వారా ఆదిశంకరులు శివనామస్మరణం అత్యంత శక్తివంతమైనదని స్పష్టం చేసారు.

11 వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ ప్రతి సరధరౌ ముక్తి జననే
జనుర్లక్షాకోటి ప్రమథన పరా విత్యసదృశౌ
కియంతో విస్రస్తా జగతి జనకా మజ్జననతః
స్మృతిం జజ్ఞే చిత్తం శివశివ కదా పృస్తు న జనుః

--

ప్రతిపదార్థం:

- శివ ఇతి — "శివ" అనే
- ద్వౌ వర్ణౌ — రెండు అక్షరాలు
- ప్రతిసరధరౌ — పునర్జన్మ సంకలనం కోసమైనవి (పునర్జన్మ ధారను తెంచేవి)
- ముక్తి జననే — మోక్షాన్ని ప్రసాదించేవి
- జనుః లక్ష కోటి — లక్ష కోట్లు జన్మలు
- ప్రమథన పరౌ — నాశనం చేయగల శక్తి కలవి
- ఇ తి అసదృశౌ — వేరే దేనికీ సమానమైనవి కావు

- మజ్జననతః – నా జన్మల వలన

జగతి – జగత్తులో

జనకాః - జన్మనిచ్చిన వారు (తల్లిదండ్రులు)

- కియంతః విస్రస్తాః – ఎంత మంది విస్తృతంగా ఉన్నారో -

- చిత్తం – ఇప్పుడు నా మనస్సు

- శివ శివ – "శివ శివ" అని

స్మృతిం జజ్ఞే = గుర్తుచేసుకుంటోంది

- కదా పి – ఎప్పుడైనా ( ఇక నాకు ఎన్నడూ)

- న జనుః అస్తు – జన్మము లేకుండుగాక !

---

తాత్పర్యం:

జీవుడు తన పూర్వకర్మల వల్ల లక్షల కోట్లు జన్మలలో పుట్టిపుట్టి మళ్ళీ మళ్ళీ భూమికి వస్తాడు.
కానీ, ఆ జన్మపరంపరను నశింపజేసి మోక్షాన్ని ప్రసాదించే మహాశక్తి కలది "శివ" నామం.
నేను ఎన్నో జన్మలు ఎత్తాను.
ఎందరో తల్లిదండ్రులను కలిగి ఉన్నాను.
ఇకపై జన్మల చక్రం నుంచి బయటపడాలని కోరుకుంటున్నాను.
ఇపుడు శివుని నా చిత్తమున స్మరించుచున్నాను. ఇక నా కెన్నడును జన్మము లేకుండుగాక!
(శివనామమును సేవించువాడు తిరుగ పుట్టడు, పుట్టడు, పుట్టడు.)

12 వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ విహజనుషి లబ్ధౌ కిల మయా
పురా గంగా స్నాతా నను కిము కృతం చాధ్వరశతం
జడస్యైవం కిం స్యా జ్జనకకృత మాద్యం ఖలు తపః
కుమారో మే స్యాదిత్యనుమిత మిదం తద్ధి పరమమ్

ప్రతిపదార్థం:

- శివ ఇతి – "శివ" అనే

- ద్వౌ వర్ణౌ – రెండు అక్షరాలు

- ఇహ జనుషి – ఈ జన్మలో

మయా- నాకు

- లబ్ధౌకిల * – లభించాయి కదా !

జడస్య – అజ్ఞానియైన నాకు

- ఏవం కిం స్యాత్ – ఇది ఎలా సాధ్యమైంది?

-

- పురా — పూర్వంలో

- గంగా స్నాతా — గంగా స్నానం చేశానా?

- నను కిము అధ్వర శతం కృతం చ — వంద యజ్ఞాలు లేక మరైదైనా చేసానా?

కుమారః మే స్యాత్ — నాకు కుమారుడు కలగాలి అని

- జనక కృతం -— నా తండ్రి చేసిన

ఆద్యం *తపః - మొదటి తపస్సు

- ఖలు — నిశ్చయంగా ఫలించి యుంటుంది కదా!.

తత్ +హి + పరమమ్ — అదియే పరమఫలముగా

-ఇ దం ఇతి+అనుమితమ్ + ఇలా జరిగిందని ఈ విషయంలో ఊహిస్తున్నాను.

తాత్పర్యం

ఈ జన్మలో నాకు "శివ" అనే రెండు అక్షరాలు లభించాయి.

ఈ అదృష్టం నాకు లభించటానికి నేను ఎప్పుడైనా గంగా స్నానం చేశానా? లేక వంద యజ్ఞములు చేసినానా?

ఇలాంటి మహాదృష్టి నాకు ఎలా కలిగింది?

నిజానికి, నేను ఓ జడుడిని (అజ్ఞాని).

అయితే, నా తండ్రి ఎప్పుడో చేసిన మహాతపస్సు కారణంగా నాకు ఈ శివభక్తి లభించిందనిపిస్తోంది.

అంతటి పుణ్యాన్ని సంపాదించిన వానికి మాత్రమే "శివ" నామస్మరణ చేసే భాగ్యం కలుగుతుంది

13 వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ శివశివ కదా నో పఠితవాన్

పురానో చేత్ కింస్విత్ జఠర పీఠరీ సంస్థితి రియమ్!

క్వ శంభో ర్నామో క్తిః క్వ జననకథా చండకిరణే

తపత్యభ్రే౽ దభ్ర భ్రమణ మిహ కిం స్యాద్ధి తమసః|| ౧౩

శివశివ - (ఏదేని అనిష్టమును చూచినపుడు గాని, వినినపుడు గాని దోషపరిహారముగ వాడు పదము.)\

శివ +ఇతి — "శివ" అనే

ద్వౌ వర్ణౌ — రెండు అక్షరాలు (శి + వ)

కదా — ఎప్పుడు

న పఠితవాన్ — పూర్వ జన్మలో నేను చదవలేదు

పురానః చేత్ — పూర్వ జన్మంలో (శివనామం) ఉచ్చరించి ఉంటే

కిం స్విత్ — ఎందుకు

ఇయమ్ — ఈ

జఠర పీఠరీ సంస్థితిః - గర్భనరక బాధ ఎందుకు కలిగింది?

క్వ శం భోః + నామ +ఉక్తిః — ఎక్కడ శివుని నామోచ్చారణ?

క్వ జననకథా — ఎక్కడ జన్మగతి?

అభ్రే చండకిరణే తపతి – ఆకాశములో సూర్యకిరణాలు మండుతుంటే

ఇహ - భూమిలో

అభ్ర భ్రమణం – మేఘ పరిభ్రమణం ఉంటుందా?

కిం స్యాత్ +హి+ తమసః – అప్పుడు చీకటికి చోటుండునా?

ఈ శ్లోకంలో కవి "శివనామ మహిమ"ను ప్రబలంగా వర్ణిస్తున్నాడు.

భావం

"నేను పూర్వ జన్మంలో ఏనాడైనా 'శివ' అనే ఈ రెండు అక్షరాలను తలచి ఉంటే, ఈ జన్మ దుఃఖం (గర్భనరక బాధ) నాకు కలిగేది కాదు"

శివనామం తపస్సుతో సమానం:

సూర్యుని కాంతి చీకటిని ఎలా పారద్రోలుతుందో,

అలాగే శివనామస్మరణ మన పాపాలను, జననబంధనాన్ని తొలగిస్తుంది

గర్భ నరకాన్ని అధిగమించేది శివనామమే:

జన్మ అనేది కష్టమయిన మార్గం.

పూర్వజన్మలో శివనామాన్ని జపించి ఉంటే, ఈ జన్మే లేకుండా ఉండేది.

శివనామం ఎప్పుడూ చెప్పాలి:

ఎందుకంటే, అది పునర్జన్మాన్ని నివారిస్తుంది.

సూర్యుడు ప్రకాశిస్తే చీకట్లు ఉండలేనట్లు,

శివనామస్మరణ ఉంటే పునర్జన్మ ఉండదు!

సారాంశం:

ఈ శ్లోకం శివనామమహిమను తెలిపే అద్భుతమైన శ్లోకం.

శివనామం ఉచ్ఛరించేవారికి మరల జన్మ లేదు!

"ఓం నమః శివాయ" అని ఎప్పుడూ జపించాలి.

🔱హరహర మహాదేవ! 🔱

14 వ శ్లోకం

శివేతి ద్వావర్ణౌ నిరత దురిత ధ్వంసనపరౌ

అయత్నాద్యస్యాస్తాం జగతి సకృదాస్యాంతరగతౌ _

న తస్యాప్యాశాస్యః సురకులధురీణస్య నిలయః

న ధాతుస్తస్యాసీత్పితురపి స సర్వస్య జనకః __ ౧౪ __

ప్రతిపదార్థం

శివ – శి, వ

ఇతి – అను

ద్వౌ వర్ణౌ – రెండు అక్షరాలు (శి + వ)

నిరత – నిత్యం (ఎల్లప్పుడూ)

దురిత ధ్వంసన పరౌ – పాపాలను నశించడంలో నిమగ్నమైనవి.

అయత్నాత్ – యత్నం లేకుండానే, శ్రమ లేకుండా

యస్య – ఎవరి నోటి నుండి

సకృత్ – ఒక్కసారి అయినా

ఆస్య అంతరగతౌ – నోటిలో ప్రవేశిస్తే (పలికితే)

జగతి – లోకంలో

సః సర్వస్య జనకః – యావత్ విశ్వాన్ని సృష్టించగల వాడు అతడు అవుతాడు.

స్తాం – అవుతాడు.

తస్య +అపి – అతనికి

సురకుల ధురీణస్య – దేవతలలోనూ ప్రముఖమైన

నిలయః – నివాసస్థానం అంటే స్వర్గము కాని)

ధాతుః పితుః – బ్రహ్మ దేవుని తండ్రి యైన విష్ణుదేవుని నివాసమయిన

తస్యాః అపి - వైకుంఠం కాని

అస్యాః ఆశాస్యః న – ఇతనికి ఆశించదగినది కాదు.

తాత్పర్యం

శివ అనే రెండక్షరాలు ఎప్పుడూ పాపాలు నశింప చేస్తాయి.

ఎవడు ఈ శివ అనే అక్షరాలని అప్రయత్నంగా అయినప్పటికీ తన నోటి వెంట పలుకుతాడో, వాడు సర్వమును సృష్టించగల సామర్థ్యం పొందగలిగినవాడు అవుతాడు

కనుక స్వర్గమును కానీ విష్ణులోకమును కానీ కోరుకోడు

( శివ నామము స్వర్గము కంటే వైకుంఠం కంటే గొప్పదైన స్థానాన్ని ప్రసాదిస్తుంది)

15 వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ జగతి సమవాయ స్తదపరం
నిమిత్తం వర్ణానాం శ్రుతిపథ రహస్యం నిగదితమ్_
నచే దిత్థం సృష్టౌ పరికర ఇహాన్యోస్తి యది కః
శివే సర్వాద్వైతే న కిమపి చ వస్తు ప్రథయతి||

పద విభజన

1. శివేతి

శివ + ఇతి

అర్థం: 'శివ' అని (అనే మాట)

విశేషం: ఇక్కడ "శివ" అన్న పదమే తత్త్వము. "ఇతి" అనే ఉపసర్గం వాక్యరూపంలో ఒక పదాన్ని చూపించేటప్పుడు ఉపయోగిస్తారు.

2. ద్వౌ వర్ణౌ

ద్వౌ = రెండు

వర్ణౌ = అక్షరములు/పదములు

అర్థం: రెండు అక్షరాలు (శి + వ)

విశేషం: "శి" మరియు "వ" అనే అక్షరాల కలయికే "శివ" అనే మహిమాన్వితమైన పదాన్ని కలిగించింది. ఈ రెండే సృష్టికి మూలమైన శబ్దబీజాలు.

3. జగతి సమవాయః

జగతి = లోకంలో / సృష్టి ఏర్పడటానికి

సమవాయః = కలయికగా ఉన్నాయి.

అర్థం: ఈ జగత్ (ప్రపంచం) ఆ రెండు అక్షరాల కలయికతోనే ఉద్భవించింది

విశేషం: సమవాయ అనేది సాంఖ్య-న్యాయశాస్త్రంలో ఒక శాశ్వత సంబంధం, ఉత్పత్తికి అవసరమైన అనుభావ్య కారణం.

వర్ణానాం = స్హమస్త వర్ణాల యొక్క సృష్టికి

ద్వౌ వర్ణౌ = ఈ రెండు అక్షరాలు (శి + వ)

నిమిత్తం = కారణంగా ఉన్నాయని

శ్రుతి-పథ-రహస్యం నిగదితమ్

శ్రుతి = వేద

పథ = మార్గములో

రహస్యం = రహస్యముగా

నిగదితమ్ = చెప్పబడింది

అర్థం: ఈ విషయం వేద మార్గంలో రహస్యంగా చెప్పబడింది

విశేషం: శివతత్త్వం వేదాంతంలోని అంతర్లీనమైన (esoteric) బోధన, ఇది ప్రతి శబ్దంలో, ప్రతి పదంలో అంతర్భూతమై ఉన్నది.

తత్ = అది

న చేత్ = కాదంటే

ఇత్థం = ఈ విధముగా

సృష్టౌ పరికరః = సృష్టికి అవసరమైన సాధనముగా

ఇహ = ఈ లోకంలో

యది అన్యః అస్తి = వేరొకటి ఉన్నదా? (లేదని భావం)

కః= ఒక వేళ ఉన్నదని వాదిస్తే అది ఏది?

అర్థం: ఈ శివ రెండు అక్షరాలకన్నా వేరే అక్షరాల సృష్టికి ప్రధాన కారణం మరొకటి లేదు

శివే = శివుడు తప్ప

సర్వ = సమస్తములో

అపరం= మరొకటి కానరాక

అద్వైతే = ద్వైతములేని స్థితిలో

ప్రథయతి = అది వెలుగుచుండగా

వస్తు = వేరొక వస్తువు

కిమపి న = ఎలా లభిస్తుంది? ( లభించదని భావం)

విశేషం: శివతత్త్వం అఖండం, స్వయం ప్రకాశమయం. అందులో బాహ్యమైన వస్తువులు లేవు; శివుడు ఒక్కడే పరిపూర్ణంగా వెలుగుతున్నాడు.

తాత్పర్యం:

ఈ శ్లోకంలో "శివ" అనే రెండు అక్షరాలు అన్నీ కలిసిన మూలం అని చెప్పబడింది.

ఈ రెండే సృష్టికి మూలకారణం, అన్నీ వర్ణాలూ, శబ్దాలూ, రూపాలూ, తత్త్వాలూ శివునిలోంచే వచ్చాయి.

శివునిలో పుట్టి అన్నీ, శివునిలో లయమవుతాయి.

అద్వైత దృష్టికోణంలో చూస్తే — శివుని వెలుపల ఏ వస్తువూ అసలు లేదు. ఈ విషయాన్ని వేదాలు కూడా రహస్యంగా తెలియజేస్తున్నాయి.

'. ఈ చెప్పబడి నట్లుగాక - ఈ సృష్టికి కావలసిన సాధనసంపద వేరొ కటి యున్నదన్నచో అది యేది? శివుడు దక్క వేరొ కటి లేదన్న శివాద్వైత మిట్లు వెలుగుచుండగా సృష్టిపరికరమగు వేరొక వస్తు వెట్లు లభించును?

(ఈ లోకములు శివునివలన పుట్టి శివునిలో ఉండి , శివునిలో లీనమగుచున్నాయి. )

16 వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ వచసి మనసిధ్వస్త దురితౌ
ప్రహృత్యాంతర్ధ్వాన్తం మిహిర శశినో శ్శక్తి మఘనామ్
ప్రహస్య వ్యాఖ్యాత స్తదుచిత తమోభేదనపదే
సమాసే నో షష్ఠీ వికసతి తృతీయైవ సుకరా!!!

ప్రతి పదార్థము:

_ శివ-శివ _

_ ఇతి-అను (సూచించే ఉపసర్గ) _

_ ద్వౌ వర్ణౌ-రెండు అక్షరాలు (శి, వ) _

_ వచసి మనసి-వాక్యంలోను, మనస్సులోను _

_ ధ్వస్త దురితౌ-నశించిన పాపాలు (కలుషాలు) _

_ ప్రహృత్య-తొలగించి, తీసివేసి _

_ అంతఃధ్వాన్తం-అంతర్గత చీకటిని హరించి (అజ్ఞానం)

_ మిహిర శశినోః-సూర్యుడు మరియు చంద్రుల _

_ శక్తిమఘనామ్-శక్తిని తక్కువగా _

_ ప్రహస్య-హాస్యంగా, పరిహాసంగా చూస్తూ _

_ వ్యాఖ్యాత్-ఇలా వ్యాఖ్యానిస్తున్నాయి.

_ త త్ +ఉచిత -ఆ సూర్య చంద్రులకు తగిన _

_ తమోభేదనపదే-చీకటి తొలగించు అనే పదం యొక్క _

_ సమాసే-సమాసంలో _

_ నః-మాకు, మా అభిప్రాయంలో _

_ షష్ఠీ-షష్ఠీ సమాసం genitive compound) _

_ న వికసతి-వికసించదు, చెల్లదు _

_ తృతీయా+ఏ వ-తృతీయా సమాసమే (instrumental compound) _

_ సుకరా-సులభం, తగినది

---

తాత్పర్యము:

"శివ" అనే రెండు అక్షరములు (శి+వ) వాక్యంలోను, మనస్సులోను ఉన్న అవి పాపాలను (కలుషాలను) నాశనం చేస్తాయి.
ఈ "శివ" అనే రెండు అక్షరములు మన హృదయంలోని అజ్ఞాన చీకటిని తొలగిస్తాయి.
ఇలా చేస్తూ, వెలుతురు ఇచ్చే సూర్యుని, చంద్రుని శక్తి ఎంత చిన్నదైందో (అందులోని పరిమితి) అని సరదాగా ఇలా వ్యాఖ్యానిస్తాయి.
"సూర్యుడు, చంద్రుడు తమోభేదకులు అని చెప్పినప్పుడు షష్ఠీ సమాసం కుదరదు. ఎందుకంటే వారు "తమస్సుకు భేదనులు" కాదు
తమస్సుచే భేదనులు అని – "చీకటిచే చీల్చబడువారు అని తృతీయా సమాసము చెప్పుకోవాలి.
విశేషాలు
'శివ' యను రెండక్షరములు వాక్కునందలి, మానసము నందలి కాలుష్యమును దొలగించి - హృదయ మందలి అజ్ఞాన మనెడు చీకటిని హరించి, వెలుపలి చీకటి" మాత్రమే హరింపగలవారైన సూర్యచంద్రుల అల్పశక్తిని పరిహసించుచు- 'తమోభేదనులు' (చీకటిని చీల్చువారు) అని వారికి ఉన్న పేరును పరిహసిస్తున్నాయి.

17 వ శ్లోకం

శివేతి ద్వౌ వర్ణౌ భువన భవజాతాండఘటనా
పటిష్ఠే చోర్ధ్వాథ స్ఫ్పుట పటుతరే ఖర్పరయుగే
శివోలింగం సర్వం తదు దరగతం స్యాద్ధి నిగమః
తథావాదీ సత్యం వదతి ఖలు తత్కేన భవతి||

శివ ఇతి ద్వౌ వర్ణౌ – "శి" మరియు "వ" అనే రెండక్షరాలు
భువన = లోకముల
భవ = సృష్టికర్త నుండి
జాత = పుట్టిన
అండ = , బ్రహ్మాండ
ఘటనా = నిర్మాణం,
పటిష్ఠే చ = బలంగా నిలబడిన విషయములో
ఊర్ధ్వ + అథ స్ఫుట పటుతరే ఖర్పరయుగే – పైన మరియు క్రింది ఉన్న బలమైన ఉన్న పెంకులు గా ఉన్నాయని భావించవచ్చు

సర్వం శివ లింగం — ఈ సృష్టి మొత్తం శివలింగమే

తత్ +ఉదరగతం స్యాత్ = ఆ కపాలముల కడుపు లో లోకాలున్నాయి.

నిగమః హి= వేదము

తథావాదీ = అలాగే చెబుతూ

సత్యం వదతి ఖలు= సత్యము చెప్పుచున్నది కదా

తత్ కేన భవతి? — ఈ విధంగా కాక ( శివనామములు పై కింది కపాలములుగా మారి లోకాలను రక్షించకపోతే లోకాలు రక్షింపబడుట) ఇంకెలా సాధ్యము?

తాత్పర్యము

ఈ విశ్వ బ్రహ్మాండం ఓ పెద్ద అండంలా ఉంది.

దానిని ఆవరించి పైకప్పు, క్రిందకప్పుల్లాంటి రెండు కపాలాల వంటి బలమైన వస్తువులు (ఊర్ధ్వ ఖర్పర, అధః ఖర్పర) ఉన్నాయి.

ఈ రెండు కపాలాలు "శి" మరియు "వ" అనే శబ్దరూపాలుగా నిర్వచించబడ్డాయి.

, ఈ బ్రహ్మాండాన్ని నిలుపుతున్న శక్తి ఈ రెండు అక్షరాల్లోనె ఉంది.

ఈ విధంగా బ్రహ్మాండం మొత్తాన్ని "శివలింగం"గా పేర్కొనవచ్చు.

ఎందుకంటే అది రెండు భాగాలుగా — పైభాగం, క్రిందభాగంగా — ఉన్నది, మధ్యలో సృష్టి జరుగుతున్నది.

వేదములు కూడా ఇదే సత్యాన్ని చెప్పుచున్నవి.

ఇట్లు బ్రహ్మాండములను నిలుపు శక్తి శివ నామాక్షరములకుగాక ఇతరముల కెట్లు సాధ్యమగును? ( సాధ్యము కాదని భావం)

18 వ శ్లోకం

*శివేతి ద్వౌవర్ణౌ భజ యజ శివార్ధాంగ వపుషం

త్యజాసంతం మార్గం వ్రజ శివపురీం ముక్తినిలయామ్ _

నచేదేతౌ వరౌ భజసి యజ దైవాన్యమముతః

త్యజ శ్రౌతం మార్గం వ్రజ నిరయమిచ్ఛైవ సుఖదా

* *ప్రతి పదార్థం

* శివ+ఇతి - శివ అను

* ద్వౌ వర్ణౌ - రెండు అక్షరాలను

* భజ - సేవించు

* శివ+అర్ధాంగ వపుషం - అర్ధ భాగము పార్వతి శరీరంగా కలవానిని (అర్ధనారీశ్వరుని)

* యజ - పూజించు

* అసంతం మార్గం - మంచిది కాని మార్గాన్ని

* త్యజ - విడువు

* ముక్తి నిలయామ్ - మోక్షానికి నిలయమైన

* శివపురీం - శివుని యొక్క పట్టణానికి (కైలాసానికి)

* వ్రజ - వెళ్ళు

* న చేత్ - అలా కాని యెడల

* ఏతౌ వరౌ - ఈ రెండు శ్రేష్ఠమైన వాటిని (శివ, శివ అను నామాలను)

* భజసి - సేవించక

* ఇచ్ఛా ఏవ - ఇష్టపూర్వకంగానే

* సుఖదా - సుఖాన్ని ఇచ్చేది (అని భావించి).

* దైవ+అన్యం - ఇతర దేవతలను

* యజ - పూజిస్తావా?

* అముతః - ఇక్కడ నుండి (ఈ లోకం నుండి)

* శ్రౌతం మార్గం - వేద శాస్త్రాలచే వినబడిన (చెప్పబడిన) మార్గాన్ని

* త్యజ - విడిచినవాడివై

* నిరయమ్ - నరకానికి

* ప్రజ - వెళ్తావు

* *తాత్పర్యం:*

"శివ" అనే రెండు అక్షరాలను సేవించు, అర్ధనారీశ్వరుని పూజించు. మంచిది కాని మార్గాన్ని విడువు, మోక్షానికి నిలయమైన శివుని పట్టణానికి వెళ్ళు. ఒకవేళ ఈ రెండు శ్రేష్ఠమైన నామాలను సేవించక, నీవు ఇష్టపూర్వకంగానే సుఖాన్నిచ్చేదిగా భావించి ఇతర దేవతలను పూజిస్తే, శాస్త్రాలచే చెప్పబడిన మంచి మార్గాన్ని విడిచినవాడివై నరకానికి వెళ్తావు.

* *విశేషాలు:*

* ఈ శ్లోకం శివ నామస్మరణ యొక్క ప్రాముఖ్యతను తెలియజేస్తుంది. "శివ" అనే రెండు అక్షరాల జపం మోక్షాన్ని ప్రసాదిస్తుందని చెబుతుంది.

* అర్ధనారీశ్వరుని ప్రస్తావన శివుడు మరియు శక్తి యొక్క ఐక్యతను సూచిస్తుంది.

* శివ నామాన్ని విడిచి ఇతర దేవతలను పూజిస్తే, శాస్త్ర మార్గాన్ని త్యజించినట్లవుతుందని మరియు అది నరకానికి దారి తీస్తుందని హెచ్చరిస్తుంది.

**19 వ శ్లోకం**

శివేతి ద్వావర్ణౌ పఠతి స మహాన్ ధాతృవిషయే
పలాయధ్వం యూయం భవథ భయభీతా యమభటాః _
పతంత్యా సంసార భ్ర మణ పరితాప ప్రమథన
ప్రచండాస్త్రస్యాగ్రే ప్రమథపతి వీక్షారసఝురాః

శివేతి ద్వా వర్ణౌ - శివ అని ఈ రెండు అక్షరాలను

* పఠతి - చదువుతుండగా

* సః మహాన్ - ఆ గొప్పవాడు (భక్తుడు)

* ధాతృ విషయే - బ్రహ్మ యొక్క విషయమయిన బ్రహ్మ లోకానికి చేరుకొంటాడు .

* యమ భటాః - ఓ యముని యొక్క సేవకులారా !

పలాయధ్వం - మీరు అతని దగ్గరనుండి పారిపోండి.

* యూయం - మీరు

* * భయ భీతాః - అటువంటి భక్తుని విషయంలో భయపడినవారు

* భవథ - అగుదురు( ఎందుకంటే)

* తస్య అగ్రే - అతని పై( శి వ అను రెండు అక్షరాలు జపించిన ఆ భక్తుని పై)

*ప్రమథ పతి - ప్రమథ గణాలకు అధిపతి అయిన శివుని యొక్క

* సంసార భ్రమణ పరితాప ప్రమథన ప్రచండాః - సంసార చక్రం యొక్క తిరుగుడు వలన కలిగే బాధలను తీవ్రంగా నాశనం చేయకలిగిన

* వీక్షా రస ఝురాః - చూపుల యొక్క అమృత ప్రవాహాలు

పతంత్యాః - పడుచున్నవి. ( ప్రసరించుచున్నవి)

* *తాత్పర్యం:*

ఎవరైతే "శివ" అనే ఈ రెండు శ్రేష్ఠమైన అక్షరాలను పఠిస్తారో, అటువంటి గొప్ప భక్తుడు బ్రహ్మ లోకానికి చేరుకుంటాడు కాబట్టి అతని విషయంలో యమభటులారా! మీరు భయంతో పారిపోవుదురు గాక. అటువంటి భక్తులపై సంసార చక్రం యొక్క భ్రమణం వలన కలిగే బాధలను నాశనం చేయడంలో శక్తిమంతుడైన , ప్రమథ గణాలకు అధిపతి అయిన శివుడు తన కరుణా కటాక్షాలను ప్రసరిస్తాడు.

* *విశేషాలు:*

* ఈ శ్లోకం శివ నామ జపం చేసే భక్తుల యొక్క గొప్పతనాన్ని తెలియజేస్తుంది. శివ భక్తులకు యమభటులు కూడా భయపడతారని వర్ణిస్తుంది. ఇక్కడ "ధాతృ విషయే" అనగా బ్రహ్మ లోకానికి చేరుకునే భక్తుని విషయంలో యమునికి అధికారం ఉండదని సూచిస్తుంది.

* శివుడు తన భక్తులను సంసార బాధల నుండి రక్షిస్తాడని, తన కరుణా దృష్టితో వారిని ఆనందపరుస్తాడని చెబుతుంది.

* "ప్రమథపతి వీక్షారసఝురాః" అనే పదం శివుని యొక్క ప్రేమ మరియు దయను సూచిస్తుంది.

20 వ శ్లోకం

*శివేతి ద్వౌ వర్ణౌ మమ విమల జన్మావనిరుహః
ఫలే ద్వే తత్ర ఏకం జనయతి రుచిః పాయసమయిః _
ఫలతి ఏకం సర్పిః ద్వయమ్ అపి మత్ అగ్ర గ్రసనతః
త్వరతి ఏక ఆస్వాదే నమతి రుచితా సిద్ధిః ద్వి కలనే

* *ప్రతి పదార్థం

* శివ + ఇతి – శి, వ అను

* ద్వౌ వర్ణౌ - రెండు అక్షరాలు

* మమ - నా యొక్క

* విమల జన్మ + అవనిరుహః - స్వచ్ఛమైన జన్మకు కారణమైన వృక్షములో పండిన

* ఫలే ద్వే - రెండు ఫలాల జంట.

* తత్ర ఏకం - వాటిలో ఒకటి

* పాయసమయీః రుచీః - పాయసపు రుచిని (అనుభూతిని)

* జనయతి - కలిగిస్తుంది

* ఏకంసర్పిత్ ఫలతి - మరొకటి "నేతి" రుచిగా పుట్టిస్తుంది.

* ద్వయమ్ అపి - రెండు రకాల అక్షరాలు కూడా

* మత్ అగ్ర గ్రసనతః - నేను ముందు నేను ముందు అని

త్వరతి - తొందరపడుచున్నవి.

* ఏక ఆస్వాదే - కాని ఒక దానిని ఆస్వాదిస్తూ

* రుచితా సిద్ధిః - రుచి చూసిన వెంటనే

* ద్వి కలనే - రెండవదానివైపు బుద్ధి

* నమతి – వెంటనే వంగిపోతుంది. ( ఒరుగుతుంది)

* *తాత్పర్యం:*

"శివ" అని ఈ రెండు అక్షరాలు నా స్వచ్ఛమైన జన్మకు కారణమైన వృక్షంలో పండిన ఫలముల జంట. వాటిలో ఒకటి రుచికరమైన పాయసంతో నిండిన అనుభూతిని కలిగిస్తుంది. మరొకటి నేతి రుచిగా ఫలిస్తుంది.- రెండు రకాల అక్షరాలు కూడా నేను ముందు నేను ముందు అని తొందరపడుచున్నవి. ఒక దానిని ఆస్వాదిస్తూ రుచి చూసిన వెంటనే రెండవదానివైపు బుద్ధి వంగిపోతుంది. ( ఒరుగుతుంది)

* *విశేషాలు:*

పాయసమును రుచి చూసిన వెంటనే నేయి వైపు బుద్ధి మరలినట్లు ఒక అక్షరాన్ని ఆస్వాదిస్తూ రుచి చూసిన వెంటనే రెండవదానివైపు బుద్ధి మరలుతుందని అద్భుతమైన పోలిక.

* ఈ శ్లోకం శివ నామస్మరణ యొక్క గొప్ప ఫలితాలను ఒక అద్భుతమైన దృష్టాంతంతో వివరిస్తుంది.

* "పాయసం" భౌతిక సుఖాలను, " నెయ్యి" వైరాగ్యాలను సూచిస్తాయి.

* శివ నామ జపం చేయడం వలన భౌతిక మరియు ఆధ్యాత్మిక సిద్ధులు రెండూ త్వరగా కలుగుతాయని భావం.

* ".

**21 వ శ్లోకం**

**శివేతి ద్వౌ వర్ణౌ పఠసి హఠయోగాదిభిః అలమ్ _**
**కిమ్ ఉద్దిశ్య ఆత్మానమ్ వ్యథయసి వృథా భ్రాంతిః అఫలా _**
**కరస్థే శ్రీఖండే మృగయసి హి ముస్తామ్ సికతలే _**
**జడ ఆదేశః కామ్ కామ్ దిశతి విపదమ్ నో శివ శివ**

**ప్రతిపదార్థం:**

**శివ ఇతి ద్వౌ వర్ణౌ - శివ అనే ఈ రెండు అక్షరాలను**

**పఠసి - చదువుతున్నావు**

**హఠయోగాదిభిః అలమ్ - హఠయోగాది కర్మలతో చాలు (ఇక చాలు)**

**కిమ్ ఉద్దిశ్య - ఏమి ఉద్దేశించి**

**ఆత్మానమ్ - నిన్ను నీవు**

**వ్యథయసి - బాధపెట్టుకుంటున్నావు**

**వృథా - వ్యర్థంగా**

**భ్రాంతిః అఫలా - భ్రమ నిష్ఫలమైనది**

**కరస్థే శ్రీఖండే - చేతిలో చందనముండగా**

**సికతలే - ఇసుక తిన్నెలలో ముస్తామ్ మృ గయసి హి - తుంగ ముస్తలను ( తుంగ గడ్డ అను పేరు గల గడ్డి)**

**వెతుకుతున్నావు కదా**

**జడ ఆదేశః - తెలివిలేని మూర్ఖుల ఉపదేశం**

**కామ్ కామ్ విపదమ్ - ఏ ఏ ఆపదలను**

**నః - మనకు**

**దిశతి - కలిగిస్తుందో చెప్పటం వల్లవుతుందా!**

**శివ శివ - ఓ శివా! ఓ శివా!రక్షించు**

**తాత్పర్యం:**

**ఓ మానవుడా! శివ అనే రెండు అక్షరాలను ఉచ్చరిస్తే చాలు. హఠయోగము అవసరములేదు. హఠయోగ మొదలైన కఠిన సాధనలతో నిన్ను నీవు ఎందుకు వ్యర్థంగా బాధపెట్టుకుంటున్నావు? అది నిష్ఫలమైన భ్రాంతి. నీ చేతిలో సుగంధమైన చందనం ఉండగా, ఇసుక తిన్నెలలో తుంగ ముస్తలను ( తుంగ గడ్డ అను పేరు గల గడ్డి) వెతుకుతున్నావు. తెలివిలేని వారి ఉపదేశం మనకు ఎటువంటి ఆపదలను కలిగిస్తుందో కదా! ఓ శివా! ఓ శివా! రక్షించు.**

**విశేషాలు:**

**ఈ శ్లోకంలో శివ నామ స్మరణ యొక్క గొప్పతను తెలియజేస్తున్నారు. కఠినమైన యోగ సాధనల కంటే శివుని నామాన్ని స్మరించడం సులభమైనదని , గొప్ప ఫలితాలను ఇచ్చేది అని భావం. చేతిలో ఉన్న అమూల్యమైన దానిని విడిచిపెట్టి, లేని దాని కోసం వెతకడం మూర్ఖత్వం అని తెలియజేస్తున్నారు.**

**శ్లోకం: 22**

**శివేతి ద్వౌ వర్ణౌ వద యది శివం వాంఛతి భవాన్-**

**న చేత్ ఏతన్నైవ శ్రుతి సమయ సిద్ధాంతమవదమ్-**

**వినా హేతోః కార్యమ్ న ఖలు పట తంతూన్ ఘట మృదః _**

